## దక్షిణ రైల్వే

1954 జనవరి 1 తేదీనుండి మద్రాసు జార్జిటౌన్, బుకింగు ఆఫీసునందు ప్యాసెంజరు టిక్కెట్లు జారీచేయుట రద్దు చేయబడును.

మద్రాసు 23-12-53 } ఛీఫ్ కమర్షియల్ సూపరింటెండెంటు.

## కావలెను

రు 300/-, 2వ తరగతి బి.సి. ఆఫీసు అద్దె, వ్యాపారములో 2½% కమీషను యిచ్చు పద్ధతిపై అమ్మకపు సూపరింటెండెంట్లుగా పనిచేయుటకు పలుకుబడిగల వారి (స్త్రీ, పురుషుల) నుండి దరఖాస్తులు కోరబడుచున్నవి. సెలెక్టు అయిన అభ్యర్థి లకు శిలక్షణలో (ట్రెయినింగు కాలములో) పోషణక్రింద రు 30/-లు యివ్వబడును. వివరములకు: Eastern National Transport Service Ltd. 8/2, Hastings St., Calcutta 1.

## తుంగభద్ర హైడ్రో ఎలెక్ట్రిక్ స్కీము హంపీ పవర్ హౌస్

1954 జనవరి 25 తేదీ మ॥ 2 గం॥ లలోగా దిగువ వివరించిన పనులకు సీలు వేసిన టెండర్లు సూపరింటెండింగు ఇంజనీరుగారికి చేరునట్లు పంపగోరడమైనది.

1. హంపీ క్యాంపులో 2జి. టైపు నివాస గృహములు (శాశ్వత కట్టడములు) 26 బ్లాకులు కట్టుటకు.

2. హంపీ క్యాంపులో 2యఫ్. టైపు నివాస గృహములు 9 బ్లాకులు కట్టుటకు.

ఆ. ఇటు స్లైడు స్లోపులను గ్రేడింగు చేయుటకు.

టెండరు సెట్లు ఈ ఆఫీసు నందు 16-1-1954 తిరిమిలా లభింపగలవు. సెట్టు 1-కి రు. 5-1-8 చెల్లించవలెను. డిపార్టుమెంటువారి ఫారములో పంపబడనట్టియు నిర్ణయింపబడిన గడువులోగా పంపనట్టియు టెండర్లు గమనింపబడవు.

సూపరింటెండింగు ఇంజనీరు, తుంగభద్రా హైడ్రో ఎలెక్ట్రిక్ స్కీం. తుంగభద్రడామ్, హోస్‌పేట (మార్గం) 26-12-53. తంతి : "Tungahydel"

## టెండరు నోటీసు

కర్నూలులో బిల్డింగ్సు కట్టుటకు జారీచేయబడిన టెండరు నోటీసు క్రిందివిధముగా సవరణచేయబడినది.

(1) లోగడ నివాస గృహములు కట్టుటకు పిలువబడిన టెండర్లు దాఖలు చేయుటకై నియమింపబడిన ఆఖరు తేది 30-12-53, ఇప్పుడు 4-1-54 గా మార్పు చేయబడినది. పై నివాస గృహములకు సంబంధించిన టెండరు షెడ్యూళ్లు మూడు వేరువేరు స్థలను - A. క్యాంపు, B. క్యాంపు మరియు లాక్ ధవక్ సమీపమందు—లకు షెడ్యూళ్లు ఒకటికి రు. 10/-పదిరూపాయల వంతున (యీ సొమ్ము వాపసు రాదు) పై మూడు స్థలములకు వేరువేరుగా చెల్లించి కర్నూలు, స్పెషల్ డివిజన్ ఆఫీసు మేనేజరువారి ద్వారా 28-12-53 వ ఆ తేదికి పరిమిలాన ఫారములు పొందవచ్చును. పై మూడు స్థలములలోని కట్టడములకు సంబంధిన ప్లానులు డివిజన్ ఆఫీసునందు చూచుకొనవచ్చును.

2. అసెంబ్లీ హాలు కట్టుటకు పిలువబడిన టెండర్లు దాఖలు చేయుటకై నియమింపబడిన ఆఖరు తేది 30-12-53 యిప్పుడు 11-1-54 గా మార్పు చేయబడినది. పై టెండరు షెడ్యూలు ఒకటికి ఖరీదు రు. 15/- పదిహేను రూపాయలు (ఈ సొమ్ము వాపసు రాదు) ఈ ఫారములు 4-1-54 తేదిన ఆ తేదికి పరిమిలాన కర్నూలు స్పెషల్ డివిజన్ ఆఫీసు మేనేజరుగారి వద్ద పొందవచ్చును.

జె. బి. కోయిల్ పిళ్ళే,
ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు, పి. డబ్ల్యు. డి.
స్పెషల్ డివిజన్, కర్నూలు.

## తూర్పుఆఫ్రికా ముస్లిం లకు సయ్యద్ హుస్సేన్ సలహా

### ఆఫ్రికనులతో సహకారం అవసరమని హెచ్చరిక

నైరోబీ, డిసెంబరు 26 : ఆఫ్రికనులతో సన్నిహిత సహకారంతో ముస పనిచేసి ఈ దేశ ఆదిమవాసులు తమకు అర్హమైనస్థానం పొందేటట్లు చూడాలని అర్థిక రాయబారి, భారత పార్లమెంటుసభ్యుడుగా వుండి రెండేండ్ల క్రిందట పాకిస్తానుకు వలసవెళ్ళినవాడు అయిన సయ్యదు హుస్సేన్ ఇమామ్ ఈ వేళ తూర్పుఆఫ్రికా ముస్లిములకు సలహా ఇచ్చాడు.

ప్రధమ తూర్పుఆఫ్రికా ముస్లిమ్ మహాసభలో అధ్యక్షోపన్యాసమిస్తూ సయ్యద్ ఇమామ్ ఇలా అన్నాడు. చాలా కాలంనుంచి ఆఫ్రికన్ల విషయమై అశ్రద్ధ వహిస్తున్నారు. వ్యక్తుల అవసరాలు తీర్చాలి. ఇలా చేసినట్లయితే అసంతృప్తివుండదు. అసంతృప్తి విపత్తుకు కారణభూతమవుతుంది. ఆఫ్రికాలో నివాసమేర్పరచుకొన్న ముస్లిములు, ఆసియావాసులు ఆఫ్రికాపట్ల ధర్మకర్తృత్వాలు కలిగివుండాలి. అందరితోనూ సహకరించాలి ఉద్యోగాలలో చేర్చుకోడంలో ప్రభుత్వంవారు ఆసియావాసులను యూరోపియనులను సమానంగా చూడాలి. ఉన్నతోద్యోగాలలో నిర్నిరోధమైన పోటీవుండాలి. శాసనసభలో ఆసియావాసులు పాల్గొనే అవకాశం ఇవ్వాలి.

శాసన సభలో తమకు ప్రత్యేక ప్రాతినిధ్యంకావాలని ముస్లిములు కోరుతున్నారు. పాశ్చాత్య దేశాల్లో ప్రత్యేక నియోజక వర్గాల పద్ధతిలేదు. కొన్నివర్గాల రక్షణకు ప్రాచ్యదేశాల్లో ఆ పద్ధతి తగివున్నది. కొంతకాలంవరకు ఈ ప్రత్యేక నియోజకవర్గాల పద్ధతి వుండాలి. క్రమేపి అది అదృశ్యమవుతుంది."

## పాకిస్తానుకు భారతదేశ వస్త్రాలు

### 33 లక్షల కిమ్మతుచేసే సరుకుకై మిల్లులకు ఆర్డరు

బొంబాయి, డిసెంబరు 26 : వెంటనే రవాణా చేయడానికి పాకిస్తాను కొన్ని భారత మిల్లులకు 33 లక్షల రూపాయలు విలువచేసే ధోవతులకు, చీరెలకు ఆర్డరు యిచ్చిందని తెలుస్తున్నది.

జపానుతో చేసుకున్న వ్యాపార ఒప్పందము ననుసరించి పాకిస్తాను తన కుకావలసిన వస్త్రాలలో విశేషభాగం జపానునుంచి తెప్పించుకోవలసి వున్నది. కాని జపాను ఎక్కువ ధరలు చెప్పుతూ వుండడంవల్ల పాకిస్తాను తన కుకావలసిన బట్టనంతా జపాను నుంచి తెప్పించుకోజాలదని వ్యాపారవర్గాల వారు తెలుపుతున్నారు. ఇంతేగాక జపాను వెంటనే బట్ట ఎగుమతి చేయజాలదు. ఈ కారణాలవల్ల పాకిస్తాను భారతదేశమునుంచి ఎక్కువ బట్ట దిగుమతి చేసుకోవలసి వుంటుందని వారు విశ్వసిస్తున్నారు. ఈ విషయమై జపాను పాకిస్తానుమధ్య రాయబారాలు జరుగుతున్నవని ఒక వారములోపుగా పరిస్థితి స్పష్టం కాగలదని తెలుస్తున్నది.

### ఆంధ్ర సంఘము పెరంబూరు

మద్రాసు, డిశంబరు 27: పెరంబూరు ఆంధ్ర సంఘమువారు ప్రఖ్యాత సినిమానటుడు, డైరెక్టరు, నిర్మాత శ్రీ చిత్తూరు నాగయ్యగారి అధ్యక్షతన జనవరి 3-వ తేదీ ఆదివారం సా॥ 6 గం॥లకు మద్రాసు గోవిందప్ప నాయక వీధిలోని సౌందర్యమహాలునందు శ్రీ పినిశెట్టి శ్రీరామమూర్తిగారు రచించిన "పల్లెపడుచు" నాటకమును ప్రదర్శించెదరు.

## నెహ్రూ ఎన్నికలలో కాంగ్రెసు ప్రచారం

### అధ్యక్షుడు నెహ్రూరాక

అంబాలా, డిసెంబరు 27 : భారత జాతీయ కాంగ్రెస్ అధ్యక్షుడు జవహర్లాల్ నెహ్రూ సిరీ హిండ్ వెళుతూ ఈ దినం ఇక్కడ దిగివచ్చారు. ఆయనను విమానాశ్రయంలో పెప్సూ సలహాదారు పి. ఎస్. రావు ప్రభృతులు స్వాగతమిచ్చారు. సిరీ హిండ్‌లో నెహ్రూ పెప్సూ ఎన్నికల సందర్భంలో కాంగ్రెస్ పార్టీ ప్రచారాన్ని ప్రారంభిస్తారు. సిక్కు తిరునాళ్ల సందర్భంలో వేలాది సిక్కులు ఇప్పుడు అక్కడ చేరువచ్చి వున్నారు.

### శ్రీమతి విజయలక్ష్మి

బొంబాయి, డిసెంబరు 27 : ఐక్య రాజ్యసమితి అధ్యక్షురాలు శ్రీమతి విజయలక్ష్మి పండిట్ ఈ వేళ విమానంలో ఢిల్లీనుంచియిక్కడికివచ్చింది ఇక్కడ నాలుగయిదు రోజులుండి ఢిల్లీకి తిరిగి వెళ్లుతుందని తెలుస్తున్నది.

## కొత్త పరిశ్రమల రక్షణ బాధ్యత

### టారిఫ్‌కమిషన్ హెచ్చరిక

బొంబాయి, డిసెంబరు 26: "ఇండియా వంటి వెనుకబడిన దేశంలో కొత్త పరిశ్రమలను జాగ్రత్తగా కాపాడి పారిశ్రామిక వ్యవస్థను బలపరచటం అవసరం. దేశంలో ప్రజలకు తగినంతపని దొరికి, వారి ఆదాయం పెరగటానికి ఇది చాలా అవసరం. ఎంతో అభివృద్ధిచెందిన అమెరికా వంటి దేశాలు, పరిశ్రమల రక్షణకు రక్షణసుంకాలను విధించుకుంటున్నప్పుడు మనదేశంలో ఇది ఎంత అవసరమో చెప్పక్కర్లేదు" అని టారిఫ్‌కమిషన్ నేడు తన ప్రథమ వార్షిక నివేదికలో హెచ్చరించింది.

మొత్తంమీద 1952-53 లో దేశంలో వివిధపరిశ్రమల ఉత్పత్తి ఖర్చులు పెరిగినవనీ, ముఖ్యంగా కార్మికుల వేతనాలవల్లు ఎక్కువ పెరిగిందనీ ఆనివేదిక చెప్పివున్నది.

మోటారుబండ్ల నిర్మాణపరిశ్రమకు సహాయంచేసే విషయమై తాము చేసిన పరిశీలనను టారిఫ్‌కమిషన్ వివరిస్తూ, కొన్నిచిక్కులు ఉన్నప్పటికీ అన్ని ఇంజనీరింగ్ పరిశ్రమలకూ తల్లివంటిదయిన ఆ కీలకపరిశ్రమను దేశంలో నెలకొల్పటం అవసరమని సూచించింది.

## కమ్యూనిస్టుపార్టీ 3 వ మహాసభ సన్నాహం

మధుర, డిసెంబరు 26 : భారత కమ్యూనిస్టుపార్టీ 3 వ మహాసభఇక్కడ రేపటినుంచి 8 రోజులు జరుగనున్నది. పార్టీ నాయకులంతా వచ్చేశారు. రావలసిన 400 ప్రతినిధులలో సుమారు 250 మంది ఇవ్వాళటికి చేరారు. బ్రిటన్, చైనా, ఇండోనీషియా, సిలోన్, పాకిస్తానునుంచి సౌహార్ద ప్రతినిధులు రాగలరని తెలిసింది. వీరిలో బ్రిటను, చైనాలనుంచి వచ్చినవారు ఇక్కడికి చేరారు.

పార్టీ కేంద్రసంఘం నిన్న సమావేశమై సభావ్యవహారం ఎట్లా జరగాలో చర్చించి నిర్ణయించారు. ఇవ్వాళ తీర్మానం ముసాయిదాలు తయారు చేశారు. ఈ సాయంత్రం బ్రిటిష్ కమ్యూనిస్టుపార్టీ కార్యదర్శి హారీ పాలిట్ కి తేనీటివిందు చేశారు.

తాను నేడిక్కడకు వచ్చింది ఈ దేశపు పార్టీకి సలహాలివ్వటానికి కాదనీ, సౌహార్ద ప్రతినిధిగా మహాసభలో పాల్గొనేందుకేనని పాలిట్ అన్నారు.

## ఉత్తరప్రదేశ్‌లో ఆంధ్ర విద్యార్థుల పర్యటన

లక్నో, డిసెంబరు 26 : ఉత్తర హిందూస్థానములో పర్యటిస్తున్న ఆంధ్ర విద్యార్థిబృందము గత సాయంకాలము ఆగ్రానుండి యిక్కడికి వచ్చింది.

ఈ బృందమునకు రాజమండ్రి ఆర్ట్సు కాలేజి అధ్యాపకులు ప్రొ॥ జి. ఎస్. ఎస్. ఆచార్య నాయకులు విద్యార్థులు 58 మంది వున్నారు.

ఈ బృందము ఈ వేళ ఉదయం ఉత్తరప్రదేశ్ ముఖ్యమంత్రి పండిత గోవిందవల్లభపంతును, విద్యాశాఖ మంత్రి శ్రీ హరగోవింద్ సింగును దర్శించి మాట్లాడారు.

ఢిల్లీ ఆగ్రాలను దర్శించి వచ్చిన ఈ బృందము ఈ వేళ సాయంకాలము అలహాబాదుకు బయలుదేరి వెళ్లింది.

### నైప్సు కౌన్సిలు

న్యూఢిల్లీ, డిసెంబరు 26 : డిసెంబరు 23 న ప్రారంభమైన కౌన్సిల్ ... సమావేశాన్ని సమాప్తం ... అధ్యక్షుడు ఈ వేళ ఈ తీర్మానం జారీచేశారు.

### ద్రవ్య వినియోగ బిల్లుకు మద్రాస్ అసెంబ్లీ ఆమోదం

మద్రాసు, డిసెంబరు 26 : మద్రాసు ప్రభుత్వ ద్రవ్యవినియోగబిల్లుకై మద్రాసు అసెంబ్లీలో ...

## హోమియోపతి వైద్యం పస

### అఖిలభారత వైద్యమహాసభ అధ్యక్షుని ప్రసంగం

సికిందరాబాదు, డిసెంబరు 27 : హోమియోపతి వైద్యం చాలా సుగమమైనట్టిది కాదని, ఎంతమాత్రం పసుర్థ నీయంకాదని అఖిలభారత వైద్యమహాసభ అధ్యక్షుడు డాక్టర్ ఎస్. సి. సేన్ అన్నారు.

ఇక్కడ జరుగుతున్న 30-వ మహాసభ అధ్యక్షత ప్రసంగంలో ఆయన ఈ వైద్యవిధానంగురించి ఇంకా ఇల్లా అన్నారు : రాష్ట్రపతి రాజేంద్ర ప్రసాద్, ఈ విధానం ప్రపంచమంతటా చాలా మందికి వినియోగపడుతున్నట్లు ప్రచురణ అయింది. ఇది సరికాదు. అసలు ఆ విధానం పుట్టిన జర్మనీలో నే ఈనాడు అది కనపడదు. అమెరికాలో ఇదివరకు చాలా వ్యాప్తిలో వుండేది నేనాడు కాని అక్కడా ఇప్పుడు అంత వ్యాప్తి లేదు. ఒక్క భారతదేశంలోనే ఇంకా ఉంటోంది. మనదేశంలో 30 లక్షల మంది హోమియో వైద్యులు వున్నారు. అమెరికాలో 500 మంది అయినా వుంటారో లేదో. మొత్తంమీద ప్రపంచమంతటాకూడా ఈ విధానం క్రమంగా నశిస్తోంది.

ఆయుర్వేదంగురించి మాట్లాడుతూ ఆయన ఇల్లా అన్నారు: భిషగ్వరులూ, సంస్కృతపండితులు బృందాలు బృందాలుగా తీవ్రపరిశోధనలుజరిపి, ఆయుర్వేదశాస్త్రాన్ని ప్రపంచం ముందుకు తేవాలి. అంతేగాని కృత్రిమంగా ఎత్తులు పెట్టి ఆయుర్వేదాన్ని పునరుద్ధరించ ప్రయత్నించటం నిష్ప్రయోజనం. సంస్కృతభాషా పరిజ్ఞానంగల ఆధునికవైద్యులు దీనిని అభ్యసించి, సాధ్యమైనప్పుడెల్లా ఈ విధానాన్ని అనుసరిస్తావుంటే చాలా మంచిది. ఆయుర్వేదవిధానంలో పోస్ట్ గ్రాడ్యుయేట్ కోర్సులు ఏర్పాటు చేయాలి. అండర్ గ్రాడ్యుయేట్ మెడికల్ విద్యార్థుల పాఠ్యాంశాలలో దీనిని నిర్బంధం చేయటంకూడా మంచిది.

## భారతసంఘ సేవా సభ

### సికింద్రాబాద్‌లో వార్షిక సమావేశం ప్రారంభం

సికిందరాబాదు, డిశంబరు 26: భారత సంఘసేవా మహాసభ వార్షిక సమావేశం ఆరురోజుల కార్యక్రమం ఇవాళ ఉస్మానియా విశ్వవిద్యాలయానికి చెందిన చక్కని ఉద్యాన వాటికలో ప్రారంభమయింది. ముఖ్యమంత్రి డాక్టరు బూర్గుల రామకృష్ణరావుగారు ప్రారంభోత్సవం జరిపారు. భారతదేశం నలుమూలల నుంచీ స్త్రీలూ, పురుషులూ దాదాపు 300 మంది సంఘసేవా కార్యకర్తలు ఈ మహాసభకు హాజరయ్యారు. బొంబాయి ఆర్థిక మంత్రి డాక్టరు జీవరాజ మెహతా గారు అధ్యక్షత వహించారు.

సంఘసేవా విధులను సరిగా అకళింపుచుకొని, సంఘసేవను చక్కని వ్యవస్థమేరకు సాగిస్తూ దేశానికి సేవ చేయగలిగినట్లు, అన్ని అర్హతలూగలిగి నట్టి, చక్కని సుశిక్షిత సంఘసేవక దళంయొక్క ఆవశ్యకతను మెహతాగారు తమ ప్రసంగంలో ఉద్ఘాటించారు.

## హైదరాబాద్ కాంగ్రెస్ విభేదాల పరిష్కారం

### జనవరి 1 న కాంగ్రెస్ కార్యదర్శి రాక

సికిందరాబాదు, డిసెంబరు 26: కౌలుదారీ శాసనం విషయమై మంత్రి వర్గానికి, కాంగ్రెసు లెజిస్లేచర్ పార్టీకిమధ్య సామరస్యం కుదర్చడానికి జనవరి మొదటి వారంలో మరొక ప్రయత్నం జరగబోతున్నది.

హైదరాబాదు కాంగ్రెసులోని ఉభయ పక్షాలకూ రాజీకుదర్చడానికి మార్గం చక్క దిద్ది తీర్చుటకుగాను కాంగ్రెసు కార్యదర్శి బలవంతరాయి మెహతా గారు జనవరి 1 వ తేదీనాడు ఇక్కడికి వస్తున్నారు.

పండిట్ నెహ్రూ 2 వ తేదీన వస్తారు. ఉభయులకూ శాశ్వతమైన పరిష్కారం కుదర్చడానికి ఆయన ఇక్కడి కాంగ్రెసు నాయకులందరితోనూ విడివిడిగానూ, సమష్టిగానూ కూడా సంప్రతింపులు జరపనున్నారు.

ఐటి హాలుకన్న ఈసాలు మద్రాసు రాష్ట్రంలో అనుకూల పరిస్థితి యున్నదనీ, కేంద్ర ప్రభుత్వ సహాయంతో చాలా కష్టకాలాన్ని గడిచి గట్టెక్కామని చెప్పారు. తమ ప్రభుత్వం అధికారంలోకి వచ్చినప్పుడు ద్రవ్యం నిల్వ—44 లక్షలు ఉన్నా క్రింద చేసిన బడ్జెటుకానికి రూ 313 లక్షలు నిల్వవచ్చిన దన్నారు. కేంద్ర ప్రభుత్వం రూ 17 కోట్లు దాకా ఋణాలిచ్చినందున ద్రవ్యనిల్వలో ఈసాలు ప్రారంభమైన దన్నారు.

## పశ్చిమదేశాలతో యుగోస్లావియా స్నేహం

### సమానత్వమే ప్రాతిపదికగా వుండాలని యుగోస్లావియా విదేశాంగమంత్రి ప్రకటన

బెల్‌గ్రేడ్, డిసెంబరు 27: యుగోస్లావియా తిరిగి సోవియట్ కూటమిలోకి పోదలుస్తున్నదని పాశ్చాత్య రాజ్యాలలో వ్యాప్తిలో వున్న పుకార్లు లన్నీ కూడా అసమంజసమైనవనీ, దురుద్దేశపూర్వకమైనవనీ యుగోస్లావియా విదేశాంగమంత్రి అన్నారు. తమ దేశం అన్ని దేశాలతో మామూలు సంబంధ బాంధవ్యాలు ఏర్పరుచుకొనే విధానం అనుసరిస్తున్నదనీ, దీనిని ననుసరించుకొంటూ ఎవ్వరికీ సంజాయిషీ చెప్పుకోవలసిన పనిలేదనీ కూడా ఆయన అన్నారు. 1948 లో తాము రష్యాతో విడిపడింది. ఆ దేశంలోని సమాజవ్యవస్థ సామ్యవాదం కాదనీ, యుగోస్లావియా పట్ల ఆదేశం కనపరచిన ఉగ్రవిధానమే ననీ, అంటూ, తమ దేశం దరిమిలాను పాశ్చాత్యరాజ్యాలతో బంధాలు కలిపింది. ఆదేశాలలోని సమాజ వ్యవస్థను పట్టి కాక, పారస్పర్యానికి అనుగుణమైన షరతులూ విధించనందువల్లనే ననీ కూడా ఆయన నన్నారు. మా దేశం సోషలిస్టు దేశం కనక మేము యవి విపరీతమైన హామీ లివ్వాలని కొన్ని దేశాలు తలుస్తున్నట్లున్నది. ఆ విధంగా అంతర్జాతీయ విశ్వాసాన్ని కొనుక్కోవటం మాకు ఇష్టంలేదు. అటువంటివాటికి మేమెంతమాత్రం ఒప్పుకోము. సమానత్వం, మానవ హక్కు లయెడ గౌరవం ప్రాతిపదికగా నే మేము పాశ్చాత్యరాజ్యాలతో సహకరించగలం. అనికూడా ఆయన అన్నారు.

## సంక్రాంతినాడు విశాలాంధ్ర సభలు

### కాశేశ్వరరావుగారి విజ్ఞప్తి

హైదరాబాదు, డిసెంబరు 26: రాగల జనవరి 14 వ తేదీ మకర సంక్రాంతినాడు విశాలాంధ్ర దినం జరపవలసిందిగానూ, ఆ నాడు ఊరూరా బహిరంగ సభలు జరిపి, హైదరాబాదు రాజధానిగా తక్షణమే విశాలాంధ్ర నిర్మించాలని కోరుతూ తీర్మానాలు చేయాలనీ విశాలాంధ్ర మహాసభ అధ్యక్షుడు అయ్యదేవర కాశేశ్వర రావుగారు ఆంధ్ర, తెలంగాణాల ప్రజలకు, మైసూరు, పరిశిష్ట మద్రాసు, ఒరిస్సా, బస్తరు, చాందా లలోని తెలుగు మెజారిటీ ప్రాంతాల ప్రజలకూ విజ్ఞప్తి చేశారు.

భారత ప్రభుత్వంవారు ఉన్నతాధికార విచారణ సంఘాన్ని నియమించి నందుకు కాశేశ్వరరావుగారు తమ పత్రికా ప్రకటనలో హర్షం వెల్లడించారు.

విశాలాంధ్ర సాధించుటలో తమకుగల అస్థనూ, తమ కృతనిశ్చయాన్నీ నిదర్శనపూర్వకంగా విశాలాంధ్రలోని యావత్తెలుగువారు ప్రదర్శించాలని ఆయన కోరారు.

### సన్యాసిరాజుగారి విజ్ఞప్తి

గుణుపురం, డిసెంబరు 25 : గుణుపురం రాష్ట్రేతరాంధ్ర మహాసభ కార్యవర్గ సభ్యుడు, ఒరిస్సా పరిషత్తు ఉప సంఘసభ్యుడు శ్రీ ప్రహరాజు సన్యాసిరాజు గారిలా వ్రాస్తున్నారు. హైదరాబాదులోని తెలంగాణా, మైసూరులోని కోలారు, ఒరిస్సాలోని గంజాం కోరాపుట్టి జిల్లాలు, బళ్లారి బస్తరు చాందా జిల్లాలోని ఆంధ్రప్రాంతాలు ఆంధ్రరాష్ట్రంలో చేరి విశాలాంధ్ర ఏర్పడి తీరును.

ఆంధ్రమయమైన పై ప్రాంతములు విశాలాంధ్రకు సంకలనము చేయుటలో ముందు గంజాం కోరాపుట్టేలు. విశాలాంధ్రను కలుపుట బాంధ కావలెను. ఇందు ఒక ప్రత్యేకత కలదు. ఈ రెండు జిల్లాలు వందల సంవత్సరములనుండి పదిహేనేండ్ల క్రిందటి వరకు ఆంధ్ర ప్రాంతములోనివే, నాటిపార్లమెంటు ప్రభుత్వము ఆరు వేలమైళ్ల దూరములో ... ఒరిస్సాలో చేర్చి వేసినది. ఈ రెండు జిల్లాలకు ... విశాలాంధ్రలో చెందు తనిత్తానకీ, నాటి ... వాణిజ్య, సాంఘిక ... విషయములలో సన్నిహితమైన కూడిక పెటికిని కలదు. మందీ ప్రాంతములు అనుబంధము చేయుటతో నే విశాలాంధ్రరాష్ట్ర నిర్మాణమున పుప్రక్రమించుటయు క్షేమం.

సోదరాంధ్రులు, వివిధ సంస్థలు, ఆంధ్రశాసనసభ్యులు పార్లమెంటు సభ్యులు, ఆంధ్రపత్రికలు, ఒరిస్సా నుండి గంజాం కోరాపుట్టి జిల్లాలు విడదీయుట అవశ్యకత అత్యంత ముఖ్యమైనది గ్రహించి ఉన్నతాధికార సంఘము వారి దృష్టికి మందీ ప్రాంతముల ప్రస్తావన తెచ్చి, లోగడ జరిగిన అన్యాయమును దిద్దుకొని ఉత్కళాంధ్రుల సుహృద్భావమునకు దోహదము చేయుదురని ఆశించుచున్నాను.

### ఉస్మానియా పట్టప్రదానోత్సవం

సికిందరాబాదు, డిసెంబరు 26 — ఉస్మానియావిశ్వవిద్యాలయం ...

## ఢిల్లీకి సింహళభారతీయ ప్రతినిధివర్గం

### కొత్లెవాలను కలుసుకొనేవరకూ పంపకుండటానికి నిర్ణయం

కొలంబో, డిసెంబరు 26 : సింహళ భారతీయ కాంగ్రెస్ కార్యవర్గం ఇవ్వాళ సమావేశమై, ప్రధాని కొత్లెవాలను కలుసుకొనేవరకూ ఢిల్లీకి తమ ప్రతినిధివర్గాన్ని పంపటాన్ని వాయిదా వేస్తూ తీర్మానించారు.

ఢిల్లీలో నెహ్రూ కొత్లెవాల సంప్రతింపులు జరిగేటప్పుడు అక్కడికి ఒక ప్రతినిధివర్గాన్ని పంపాలని వారు ఇదివరలో తలపెట్టారు.

సింహళ పార్లమెంటులో ప్రతికూలపక్షు నాయకుడు బండారునాయక్, తమ శ్రీలంకపార్టీ రెండవ వార్షికమహాసభ అధ్యక్షత ప్రసంగంలో భారత సింహళ సమస్య చాలా గడ్డయినదనీ, సింహళం ఆర్థికపరిస్థితి, సింహళీయుల జాతి సమైక్యత, సింహళంలోని 8 లక్షల మైచిలుపు భారతీయుల భవితవ్యం దానితో ముడిపడి వున్నాయనీ అన్నారు.

### పాస్‌పోర్టులు వీసాలు పొందే గడువు హెచ్చింపు

న్యూఢిల్లీ, డిసెంబరు 26 : భారతదేశంలో వున్న పాకిస్తానీలూ, పాకిస్తానులో వున్న భారతీయులూ పాస్‌పోర్టులూ, వీసాలూ, పొందవలసిన గడువును ఈ నెల 31 నుంచి వచ్చే ఏప్రిల్ 30 వరకూ పెంచటానికి ఉభయ ప్రభుత్వాలూ నిర్ణయించినవి.

### రైలుమార్గాలు తెరవటానికి పాకిస్తాన్ వ్యతిరేకత

పశ్చిమ పాకిస్తానునుంచి భారతదేశానికిగలకొసూరు- ఫెరోజ్‌పూరు, హైదరాబాద్, జోద్‌పూర్ రైలుమార్గాలను తిరిగి తెరవాలన్న భారత ప్రభుత్వ సూచనను తిరస్కరించటానికి పాకిస్తాన్ ప్రభుత్వం నిశ్చయించింది. ఇట్లా అనిత్వరలో భారత ప్రభుత్వానికి తెలియ చేస్తారు.

### ఇంగ్లాండ్ అఫ్ఘనిస్తాన్ల ఒడంబడిక రద్దు

1921 లో ఇంగ్లాండ్ అఫ్ఘనిస్తాన్లు చేసుకొన్న ఒడంబడికను రద్దు చేయటానికి అఫ్ఘన్ ప్రభుత్వం నిశ్చయించినట్లు ఆ ప్రభుత్వంనుంచి ఇంతవరకూ తమకేమీ తెలియజేయబడలేదని పాకిస్తాన్ అధికార ప్రతినిధి ఈ రాత్రి అన్నారు. పాకిస్తాను ఏర్పడినప్పటి నుంచీ అఫ్ఘనిస్తాన్ పాకిస్తాన రాజకీయ సంబంధాలు ఈ ఒడంబడిక పైనే ఆధారపడి వున్నాయి.

## సూయజ్ సమస్యపై తిరిగి చర్చలు

### వచ్చే బుధవారం ప్రారంభం

కైరో, డిసెంబరు 26: సూయజ్ కెనాలు స్థావరభవిష్యత్తు విషయమై అక్టోబరు 21 న ఆపివేయబడిన ఆంగ్లో-ఈజిప్షన్ సంభాషణలు వచ్చే బుధవారంనాడు మళ్ళీ ప్రారంభమవుతవని నమ్మకంగా తెలుస్తున్నది.

అవసరము వచ్చినప్పుడు ఈ కాల్వ స్థావరమును బ్రిటన్ తిరిగి ఉపయోగించుకునే విషయము కాల్వప్రాంతములోని బ్రిటిషు ప్రవీణులు యూనిఫారములు ధరించాలా అనే విషయము ఈ రాయబారాలలో ముఖ్యమైనవిగా వున్నవి.

బ్రిటిషు రాయబారి సర్ రాల్ఫ్ స్టీవెన్సను డిసెంబరు 22 తేదీన పాకిస్తాను రాయబారవర్గ కార్యాలయంలో జరిగిన విందులో ఈజిప్షను ఉపప్రధాని లెఫ్టినెంట్ కర్నల్ గమాల్ అబ్దల్ నసీరును, మంత్రి మేజర్ సాలాసలీమ్‌ను కలుసుకుని మాట్లాడారు. ఈ సంభాషణల ఫలితంగా ఆంగ్లో-ఈజిప్షన్ సంబంధాలలో యేర్పడిన పరస్పర విద్వేషభావం సంపూర్ణంగా సడలిపోయిందని, విందులోని వాతావరణము అత్యంత సుహృద్భావపూరితంగా వున్నదని పాకిస్తాన్ రాయబారి మేజర్ అయూబ్‌హుస్సేన్ తెలిపాడు.

## "విదేశీ స్థావరాలు అంతరించాలి"

### వాటి ఉనికి ప్రమాదకరమని అనంతశయనంగారి హెచ్చరిక

నాగపూర్, డిశంబరు 26: "భారతదేశంలోని విదేశీస్థావరాలు ఎంత త్వరలో అదృశ్యమయితే దేశానికి అంత మంచిది. అట్లా అవి దేశంలో ఉండటమన్నది అవాంతర సమయాల్లో చాలా ప్రమాదకరంగా పరిణమిస్తుంది. ముఖ్యముగా యుద్ధమేఘాలు ప్రపంచాన్ని ఆవరించుకుంటున్న ఈ రోజుల్లో, పాకిస్తాన్ అమెరికాతో సైనిక ఒప్పందానికి సంప్రదిస్తున్న ఈ రోజుల్లో వాటివల్ల ప్రమాదం ఎంతో వున్నది" అని పార్లమెంటు డిప్యూటీ స్పీకర్ అనంతశయనం గారు నేడిక్కడ ఒక సభలో ప్రసంగిస్తూ హెచ్చరించారు.

మద్రాసు, డిసెంబరు 27 : ...





## టెండరు నోటీసు

తణుకు పంచాయితీ ఏరియాలో ఈ క్రింద పేర్కొనబడిన పనుల నిమిత్తం, సీలు వేసిన టెండర్లు, పశ్చిమగోదావరిజిల్లా తణుకు పంచాయితీ, ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుగారిచే ది 11-1-1954 సోమవారం, సాయంత్రం 4 గంటల వరకు స్వీకరించబడును.

| | | ఎస్టిమేటు విలువ | డిపాజిట్లు |
|---|---|---|---|
| 1. మెటల్ రోడ్ల పోషణ | 4 పనులు | రు. 2375 | రు. 120 |
| 2. గ్రావెల్ రోడ్ల పోషణ | 2 పనులు | రు. 770 | రు. 40 |
| 3. కె. టి. రోడ్డుపు తిరంపైవున (డెయిక్ కట్టుట) | 1 పని | రు. 1650 | రు. 82-8-0 |

టెండరు షరతులు వగైరా వివరములు పంచాయితీ ఆఫీసునందు పొందవచ్చును.

గ్రామపంచాయితీ ఆఫీసు, తణుకు } యస్. అకలంకస్వామి,
ప॥ గో॥ జిల్లా. ది 23-12-1953 } ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు.

## గుర్రపు పందెంలో గుండెపగిలిన చావు

మదరాసు, డిసెంబరు 28: నిన్న జరిగిన గుర్రపు పందెముల సందర్భంలో రేస్ కోర్సు ఆవరణలో ద్వితీయ ఎన్క్లోజరులో కార్పొరేషన్ పారిశుధ్య శాఖ యిన్‌స్పెక్టరు "ఖైర్యాన్ అలీ" హఠాత్తుగా గుండె ఆగి మరణించారు.

గుర్రపు పందెములలో కలిగిన ఆశాభంగమే దీనికి కారణమని తెలిసింది.

## "వెలుగు" సంక్రాంతి సంచిక

ముద్రణాలయంలో వచ్చిన అవాంతరం వల్ల 29-12-53 తేది సంచిక వెలువడదు. 5-1-54 సంచిక వెలువడును. సంక్రాంతి ప్రత్యేక సంచిక "హిమ్మ" శైలీలో సర్వాంగ సుందరముగ ప్రకటింపబడును. ఏజంట్లు, అడ్వర్టయిజర్లు, చందాదార్లు గమనింప ప్రార్థన. మద్దూరి అన్నపూర్ణయ్య, రాజమండ్రి.

అనంతపురము డిస్ట్రిక్టు కోర్టులో
E. P. No 8/51 in O S 76/49-50
of District Court Bangalore.

డిక్రీహోల్డర్. బి. వి. అప్పాజయ్యశెట్టి అందు పన్నువారి మేనేజరు. బి. చిన్నయ్యశెట్టి

ప్రతివాదులు: శ్రీ దుర్గాప్రసాద్ ఆయిల్ మిల్సు, అనంతపురం వగైరాలు.

### విక్రయ ప్రకటన

పై కోర్టులో ప్రతివాదుల క్రింద కనిన ఆస్తులు 8-1-1954 తేదీలు పగలు 11 ఘంటలనుండి బహిరంగంగా వేలం వేయబడును.

### షెడ్యూలు

అనంతపురము మునిసిపల్ హద్దులలోని ఆస్తులు (1) వ వార్డు, బ్లాకు 28, T. S No 2146 పైకి 2 యకరములు 70 సెంట్లు జాగా, యిందులోని మిల్లు, యావత్తు కట్టడములు Door No. 151, Assessment No. 151తో సహా.

(2)-1, వార్డు 1, బ్లాకు 28, T. S No. 2554 మరియు 2555 యిందులోని యిండ్లు, పూర్వపశ్చిమం 60 అడుగులు, ఉత్తర దక్షిణం 72 అడుగులు రెండు ప్లాట్లు

2, వార్డు 1, బ్లాకు 28 T S No. 2553 5 సెంట్లు పాటు అందులోని యిల్లు.

మరా:-(1)వ అయిటము ఆయకొనిలోబడి, రు. 75,000/-లకున్నూ, (2) వ అయిటం, రు. 20 000/-లకున్ను సర్కారు పనాలు ఇతర వివరములు క్రింద అడ్వకేటుగారివలన తెలుసుకోవచ్చును.

యం. సి. మల్ రెడ్డి,
వాది అడ్వకేటు.
అనంతపురం, 24-12-'53.



## రాష్ట్రపొగాకు ఉత్పత్తిదారుల సమావేశం

### వచ్చే ఫిబ్రవరి నెలలో జరపడానికి ఏర్పాట్లు

గుంటూరు, డిసెంబరు 24: కేంద్ర ప్రభుత్వమంత్రులు కూడా పాల్గొనడానికి వీలుగా ఆంధ్రరాష్ట్ర పొగాకు ఉత్పత్తిదారుల సమావేశం 1954 లో జరపడానికి సన్నాహాలు చేస్తున్నారు.

కేంద్రప్రభుత్వ వాణిజ్య పరిశ్రమల మంత్రి శ్రీ టి. టి. కృష్ణమాచారి, కార్మిక మంత్రి శ్రీ వి. వి. గిరి, ఆర్థిక ఉపమంత్రి ఎ. సి. గుహాగారలు సమావేశానికి వస్తారనుకుంటున్నారు. పార్లమెంటు సభ్యుడు శ్రీ కె. రఘురామయ్యగారు సభకు అధ్యక్షత వహిస్తారు.

వర్జీనియా పొగాకు ఉత్పత్తి, మార్కెటింగ్, ఎగుమతి మొదలైన సమస్యలన్నీ ముఖ్యంగా ఆంధ్రకే సంబంధించినవి కనుక, వాటిని ప్రత్యక్షంగా తెలుసుకోవడానికి పైన పేర్కొనబడిన మంత్రులు ఈ సమావేశానికి వస్తారనుకుంటున్నారు. గుంటూరు మార్కెటింగ్ కమిటీ సభ్యులు శ్రీ చేబ్రోలు హనుమయ్య, బొచివసుబ్బారావుగారలు ఇటీవల ఢిల్లీకి రాయబారం వెళ్లివిజ్ఞప్తులు సమర్పించారు. (స్వ వి)

## విద్యార్థులలో క్రమశిక్షణ పెంపొందాలి

### శ్రీ బాలరాజమధోక్ ఉద్బోధ

గుంటూరు, డిశంబరు 25: విద్యార్థులలో క్రమశిక్షణ, శీలం పెంపొందించి, భారతీయ సంప్రదాయాలననుసరించి దేశసేవ చేసేవారినిగా విద్యార్థులను తయారు చెయ్యడమే భారతీయ విద్యార్థి పరిషత్తు ఆశయమని అఖిల భారతీయ జనసంఘ సంస్థాపకులలో ఒకరూ కేంద్ర కార్యాలయ కార్యదర్శి అయిన శ్రీ బాలరాజమధోక్ గారు చెప్పారు. అఖిల భారతీయ విద్యార్థి పరిషత్తు సమావేశం హిందూ కాలేజి ప్రిన్సిపాల్ కలభజోష్యుల సుబ్బారావుగారి అధ్యక్షతన జరిగింది. ఆ సమావేశంలో ప్రసంగిస్తూ శ్రీ మధోక్ గారు భారతీయ విద్యార్థి పరిషత్తు ఆశయాలు వివరించారు. విద్యార్థులు ఉపాధ్యాయులు పరస్పర సుహృద్భావంతో మెలగాలనీ, విద్యార్థులు రాజకీయాలను తెలుసుకోవచ్చునే గాని, రాజకీయాలలో పాల్గొనరాదనీ, శ్రీ మధోక్ అన్నారు.

## అసెంబ్లీ స్పీకరుకు గుంటూర్లో సన్మానం

### వెంకట్రామయ్యగారి గుణగణాల ప్రశంస

(స్వకీయ విలేఖరి)

గుంటూరు, డిసెంబరు 23: నిన్న సాయంకాలం బొనువాలులో ఆంధ్ర శాసనసభా స్పీకరు శ్రీ నల్లపాటి వెంకట్రామయ్యచౌదరిగారి గౌరవార్థం పురప్రముఖులు కొందరు ఒక గొప్ప తేనీటివిందు ఏర్పాటు చేశారు. ఈ విందుకు అడిషనల్ జిల్లాజడ్జి శ్రీ నాగిరెడ్డి, న్యాయవాద ప్రముఖులు శ్రీ దశరాజు హనుమంతరావు, దివాకరుణి లక్ష్మీనారాయణ, వడింపల్లి సీతారామయ్య, గుంటూరు పురపాలకసంఘ తాత్కాలిక అధ్యక్షురాలు శ్రీమతి టూరు రంగవల్లితాయారమ్మ, ప్రభుత్వ స్త్రీల కళాశాల ప్రిన్సిపాలు శ్రీమతి అన్నపూర్ణమ్మ, జాగర్లమూడి చంద్రమౌళి, శ్రీ నార్ల వెంకటేశ్వరరావు మొదలగు ప్రముఖులనేకులు విచ్చేశారు. ఆహ్వానితుల తరపున జవాబ్ యం. ఎ. సలాంగారు, విందు అనంతరం ఆంధ్ర క్రైస్తవ కళాశాల ప్రిన్సిపాలు శ్రీ టి. యస్. పౌలుసుగారి అధ్యక్షతన సభ జరిగింది.

అధ్యక్షులు తమ ప్రసంగంలో శ్రీ వెంకట్రామయ్యగారు తమ సహాధ్యాయి అని, ఆంధ్ర క్రైస్తవ కళాశాలలో సహ చదువుకున్నారని, గత 30 సంవత్సరములుగా వారితో తమకు సన్నిహితమైన పరిచయం కలదని, వారు నిర్దుష్టమైన వ్యక్తి అని, నిష్కల్మష హృదయులనియు, అట్టివారి చేతుల్లో ఆంధ్రశాసనసభా కార్యక్రమం నిర్విఘ్నంగా జయప్రదంగా నడచి గౌరవము సంపాదించుకుంటగలదని చెప్పుటకు తమకేలాటి సందేహం లేదన్నారు.

శ్రీ కె. వి. రెడ్డిగారు ఆంధ్రదేశ రాజకీయపరిస్థితులు ఒక్క సాధారణ స్థాయిలో నడుచుచున్నవనియు, యిటి అసాధారణపరిస్థితులో శ్రీ నల్లపాటి వెంకట్రామయ్యగారిలాంటి ఒక అసాధారణ వ్యక్తి అధ్యక్షస్థానం ఆంధ్రశాసనసభా కార్యక్రమ నిర్వహణకు అవసరమనియు, ఆంధ్ర రాష్ట్ర భవిష్యత్తు మీద అధారపడియున్న ఇతర సమస్యలను పరిష్కరించడానికి దోహదం చేయగలదని అన్నారు.

శ్రీ చిన్నవ లక్ష్మీనారాయణగారు తమ ప్రసంగంలో కొలువబడిన సంవత్సరముల వారి రాజకీయ జీవితం ఆంధ్రరాష్ట్రములో సుస్థిర ప్రజాస్వామిక ప్రభుత్వము నిర్వహణకు తోడ్పడగలదనియు, ... ప్రజాస్వామ్య నిర్వహణ ... శ్రీ ప్రకాశంపంతులుగారి కంటె మహోన్నతమైన నాయకత్వం క్రింద నిర్వహింపబడుచున్న ప్రజా ...

## నాగులదేవునిపాడు పశుగణాభివృద్ధి కేంద్రం

### పశుగణాభివృద్ధి శాఖాధికారి పరిశీలన

[స్వకీయ విలేఖరి]

ఏలూరు, డిసెంబరు 23: ఆంధ్రరాష్ట్ర పశుగణాభివృద్ధి శాఖాధికారి డాక్టర్ బషీర్ అహమ్మద్ షిరాజ్ గారు, జిల్లా పశువైద్య శాఖాధికారి డా॥ ఎల్. డి. పట్నాయక్ గార్లు ఈ నెల 17 వ తేదీని నాగులదేవునిపాడులో యిటీవల స్థాపింపబడ్డ పశుగణాభివృద్ధి కేంద్రాన్ని సందర్శించారు. ఆ కేంద్రంలో పరిసర ప్రాంతీయ గ్రామాలలోని ఆవుల ఉపయోగం నిమిత్తం ప్రభుత్వంవారు 6 ఒంగోలు వృషభాలను ఏర్పాటు చేశారు.

కాని, ఆ కేంద్రం ఆశించినంతగా ప్రజలు ఉపయోగపడ్డట్లు కనబడటం లేదనీ, స్థానికంగా వుండే ఆవులన్నీ చిన్నసైజువి అవటంవల్ల వానికి తీసుకొని వచ్చినా, ఒంగోలు ఆబోతులకూ వానికీ జతకుదరడం లేదనీ, కొన్నిసమయాలలో యీ మూడటంటి ఆవులతో నూ కేమీ పని అని ఆ వృషభాలకు కన్నెత్తి కూడా చూడడం లేదనీ తెలుస్తోంది.

తరువాత డా॥ షిరాజ్ గారు గోపన్నపాలెంలోని కోళ్లపెంపకపు కేంద్రాన్ని కూడా చూచి, ఈ రోజు యిదివరలో యీ పశుగణాభివృద్ధి కేంద్రం స్థాపించాలని మొదట్లో అనుకున్న శింగవరం స్థలాన్ని చూచే నిమిత్తం సుండుగొలను వచ్చారు. స్థానిక రైతులు శ్రీ మామిళ్లపల్లి బాపనయ్య, శ్రీ ఉలిశెలి వెంకట్రాజు, శ్రీ బాదర్వాడ బహ్మశివార్చిత నారాయణ రాజు, పంచాయతీబోర్డు అధ్యక్షుడు శ్రీ భోగరాజు పేర్రాజు వగైరాలు డా॥ షిరాజ్ గార్ని కలిసికొని ఈ ప్రాంతంలో పెద్దసైజు ఆవులు చాలా విశేషంగా ఉన్నాయనీ, పశువుల పెంపకంలో ఎక్కువ ఉత్సాహం చూపే రైతులున్నారనీ, ఈ ప్రాంతంలో పశుగణాభివృద్ధి కేంద్రం స్థాపిస్తే రైతులు దానికి కావలసిన స్థలము, మేత మొదలయినవి ఉచితంగా యిస్తారనీ తెలిపారు. సుండుగొలనులో వున్న సివిల్ డిస్పెన్సరీని మొదట తరగతి డిస్పెన్సరీగా చేయవలసిందనీ, ఇందుకవసరమైన సదుపాయాలు చేయిస్తామనీ అన్నారు.

## ఏలూరులో శ్రీ కన్నయ్య శ్రేష్ఠి పార్కు

గత 35 సంవత్సరాలుగా అవిచ్ఛిన్నంగా ఏలూరు పురపాలకసంఘ సభ్యులుగానూ, ఒకసారి చైర్మన్ గా సేవచేసిన శ్రీ కంభంపాటి కన్నయ్య శ్రేష్ఠిగారి పేరిట బజారులో పచ్చిపులుసువారి కొట్లసమీపంలో వున్న పార్కుకు శ్రీ కంభంపాటి కన్నయ్య పార్కు అని పేరు పెట్టుటకు యీ సాయంకాలం జరిగిన పురపాలకసంఘ సమావేశంలో ఏకగ్రీవంగా తీర్మానించబడింది. సమావేశానికి శ్రీ దాము రాజు వెంకట్రావు పంతులుగా రధ్యక్షత వహించారు.

మునిసిపల్ వైస్ చైర్మన్ రాజనాల గోపాలరావు నాయుడుగారి ఇంట్లో మునిసిపల్ ఖర్చుమీద టెలిఫోన్ ఏర్పాటు చేసేందుకు కూడా కౌన్సిలువారు ఏకగ్రీవంగా తీర్మానించారు.

## భీమవరం సమీపంలో సారా నేరాలు

భీమవరం, డిసెంబరు 25: భీమవరం సబ్ ఇన్‌స్పెక్టరు శ్రీ కె. ఎస్. ఎస్. రాజుగారు వండెగండి గ్రామంలో అయిదుగుర్ని అరెస్టుచేసి అయిదు గాలన సారా స్వాధీనం చేసుకున్నారు.

జాందమూడులున్న నేరానికి చినమిరామ్ గ్రామంలో సబ్ ఇన్‌స్పెక్టరు రాజుగారు ముగుర్ని అరెస్టుచేసి స్థానిక సబ్ మేజిస్ట్రేట్ కోర్టులో హాజరు పెట్టారు.

ప్రభుత్వం సక్రమపరిపాలన సాగించుటకు తోడ్పడం చేయగలరని ఆశించారు.

శ్రీ పంగులూరు శేషగిరిరావుగారు "ఒక పార్టీ ప్రతినిధి స్పీకరుగా ఎన్నికైనప్పటికీ, అంతకు ముందు ఏ పార్టీకి చెందిన వ్యక్తి అయినప్పటికీ, స్పీకరుగారు అన్ని పార్టీలకు అతీతంగా వ్యవహరించి ప్రజాక్షేమం దృష్టిలో నుంచుకొని తమ గౌరవ స్థానమునకు కీర్తిగణించవలయు"నన్నారు.

శ్రీ జెనిరాజా హనుమంతరావు, సామలపాటి వెంకటకృష్ణయ్యచౌదరి, పదాల కోటయ్యనాయుడు, శ్రీమతి కటూరి రంగవల్లితాయారమ్మ, మదరాసు న్యాయవాది శ్రీ కొండయ్యగారలు ప్రసంగించిన తరువాత శ్రీ వెంకట్రామయ్యగారు తమ సమాధానంలో, తమ పదవి తమ రీతిగా నిర్వహించుటకు తమ న్యాయవాదవృత్తి ఎంతైనా తమకు తోడ్పడగలదనియు, ఆంధ్ర ముఖ్యమంత్రి అయిన శ్రీ ప్రకాశంపంతులుగారివలె తమకు విపరీతమైన గౌరవంకలదనియు, ఆయన ఒక అసాధారణవ్యక్తిఅనియు ... తమకు ... వారి ... చెప్పారు.

శ్రీ జి. వి. కృష్ణయ్యశాస్త్రిగారు వందనములు సమర్పించారు.

## వినుకొండ తాలూకా పరిస్థితులు

### ముఖ్యమంత్రికి విజ్ఞప్తి

నర్సారావుపేట, డిసెంబరు 25: ముఖ్యమంత్రి శ్రీ ప్రకాశం పంతులు గారు 23వ తేదీ నర్సారావుపేటకు విచ్చేసిన సందర్భంలో వినుకొండ తాలూకా కృషికార్ లోక్ పార్టీ కార్యదర్శి శ్రీ నుల్లపల్లి వెంకటసుబ్బారావు, తాలూకా పంచాయతి ప్రెసిడెంట్ల యూనియన్ అధ్యక్షులు శ్రీ కనిసెని యూర్తెయ్యగారు వినుకొండ తాలూకా రైతాంగంతరఫున విజ్ఞాపన సమర్పించారు. అందులో వినుకొండ తాలూకా కర్నూలు జిల్లా సరిహద్దుల్లో నుండుటయే గాక రాయలసీమలో కరువు వచ్చినపుడల్లా, కరువుకు యెరకాబడుచున్న దనియూ, గుంటూరు జిల్లాను చెందినప్పటికి వినుకొండ తాలూకా మెట్టప్రాంతము మాత్రమే గాక పూర్తిగా బెట్టప్రాంతమనియూ రాయలసీమ ప్రజానీకానికంటె ఆర్థిక, సాంఘిక, వైజ్ఞానిక రంగాలలో యేమాత్రము మెరుగైన జీవితాలు అనుభవించుట లేదనియూ, భూములన్నీ గరప, యిసుక, చవిటి నేలలనియూ, గత నాలుగేండ్లుగా కరువుచే పీడించబడుచున్న ప్రాంతమైనందున, విశాఖ, శ్రీకాకుళం జిల్లాలతో పాటు వెనుకబడిన ప్రాంతంగాను, రాయలసీమ సరిహద్దులలోను వుండిన వినుకొండ తాలూకాను "తిరుగు ప్రాంతాల అభివృద్ధి బోర్డు" క్రింద చేర్చాలనియూ, గత నాలుగేండ్లుగా కరువు మూలావాయిదా వేస్తూవచ్చిన భూముల సబ్సిడీలు, యితరంగా యిచ్చిన కరువు అప్పులు వకే దఫా యీ సంవత్సరమే చెల్లించలేని రైతాంగ కష్టాలను గమనించి అయిదు సంవత్సరాల సమాన వాయిదాలలో చెల్లించేలాగు వుత్తర్వులు యిప్పించాలనియూ, వరదకొండ ప్రాజెక్టును పంచవర్ష ప్రణాళికలో చేర్చాలనియూ, మద్రాసు ప్రభుత్వం మాదిరి వినుకొండ తాలూకాలో మూడు సంవత్సరాల "మారటోరియం" ప్రకటించాలనీ కోరారు.

## ముఖ్యమంత్రికి అర్చకుల విజ్ఞప్తి

తెనాలి, డిసెంబరు 24: రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ ప్రకాశం పంతులుగారు మొన్న యీ పట్టణమునకు విచ్చేసిన సందర్భంలో ఆంధ్రరాష్ట్ర అర్చక కాంగ్రెసుసభ్యులు స్థానిక మునిసిపల్ రహదారి బంగళాయందు పంతులుగారిని దర్శించి ఒక విజ్ఞాపన సమర్పించారు. ఆంధ్ర రాష్ట్రావతరణమైన కొలదిదినములకు అర్చకులు ధర్మాదాయముల మంత్రిని విశ్వనాథంగారిని దర్శించి తమ కష్టములను నివేదించగనే అర్చకులకు ట్రస్టీలకు జరుగుచున్న దావాలన్నిటిలో రాజీ ఏర్పాటు చేయుటకు అంగీకరించుమాపై ప్రకారము బందరులోని ధర్మాదాయముల కమీషనరుగారికి ఉత్తరువులు పంపినందులకు తమ సంతోషం వెలిబుచ్చుచున్నామనియు, యీ ఉత్తర్వులు పెండింగు దావాలుగల అర్చక ఈనాములకే గాక లోగడ ట్రస్టీలు స్వాధీనము చేసుకొన్న ఈనాములకుగూడ ఈ రాజీ ఏర్పాట్లు అన్వయించునట్లు వుత్తర్వులు ఇప్పించవలసినదని యీ విజ్ఞాపనలో కోరారు. దేవాదాయ ధర్మాదాయశాఖ మంత్రిగారి ఉత్తర్వులను రాష్ట్ర సంఘ సంయుక్త కార్యదర్శి శ్రీ కె. సత్యనారాయణాచార్యులు గారు చదివి వినిపింపగా శ్రీ ప్రకాశం పంతులుగారు సావధానంగా విన్నారు. అర్చకుల కోర్కెలవిషయం తమ చర్య తీసుకొనెదనని సెలవిచ్చారు. ఈ రాయబారవర్గములో శ్రీ దివి రంగనాథాచార్యులు కళ్లేకుంట పర్తివారాయణాచార్యులు యస్. పేరయ్యశాస్త్రి మొదలగువారు కలరు. (స్వ. వి)

## ఆర్థికమంత్రి విశ్వనాథంగారు

బందరు, డిసెంబరు 24: జనవరి 17 వ తేదీన ఇక్కడ జరుగనున్న ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వ న్యాయవాదుల సంఘం ప్రారంభోత్సవానికి ఆంధ్ర ఆర్థిక న్యాయశాఖల మంత్రి తెన్నేటి విశ్వనాథంగారు వస్తారని ఆ సంఘ సమావేశకర్త ఎమ్. శేషగిరి రావుగారు తెలియచేశారు.

## జాండ్రపేట పంచాయతీ బోర్డు

### 500 ఇండ్లకు పన్ను మినహాయింపు

చీరాల, డిసెంబరు 22: జాండ్రపేట పంచాయతీబోర్డువారు ఇటీవల అధ్యక్షులు డాక్టరు గుత్తి నాగయ్యగారి అధ్యక్షతన సమావేశమై 1953-54 వ సంవత్సరానికి వంచరూపాయలు. అంతకు తక్కువ కిమ్మతుచేసే ఇండ్లకు పన్ను మినహాయిస్తూ తీర్మానించారు. ఈ తీర్మానంవల్ల బోర్డు పరిహద్దులలో 500 ఇండ్లకు పన్ను మినహాయించబడెను. అర్ధసంవత్సరానికి బోర్డు ఆదాయం 125 రూపాయలదాకా తగ్గునుందని తెలుస్తున్నది. పంచాయతీబోర్డు ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ పి. కృష్ణమూర్తిగారుకూడా సమావేశానికి హాజరైనారు. (స్వ. వి.)

## ప్రయాణికుల ఇబ్బందులు

### నివారించడానికి ఆంధ్రమంత్రి శ్రద్ధ

రాజమండ్రి, డిసెంబరు 26: నిన్న సాయంత్రము కలకత్తా మెయిలులో, ఆంధ్రప్రభుత్వ పరిశ్రమల శాఖామాత్యులు గౌ॥ శ్రీ పట్టాభి రామారావు గారు - కర్నూలుకు తిరిగివచ్చుతూ - రాజమండ్రి ప్లాటుఫారముమీద దిగి తమ మిత్రులతో మాట్లాడుతూ వుండగా-ఎవరో కొందరు యాత్రికులైన ప్రయాణీకులు వచ్చి, తాము దక్షిణయాత్రనుంచి తిరిగి అపూర్వ పూరి పాసెంజరులో ద్వారపూడికి ప్రయాణం చేసున్నామనీ, తమవద్ద వున్న సామానులు ఎక్కువబరువు వున్నాయని చెప్పి ఆ రైలులో వచ్చిన టిక్కెటు ఇన్‌స్పెక్టర్లు తమను రాజమండ్రి స్టేషనులో దింపి, 20 నిముషములు వ్యవధివున్నా తూకము వేయక ఆ రైలులో వెళిపోయారనీ స్టేషను అధికారులలో చెప్పుతుంటే ఎవరూ విన్పించుకోక పూరకున్నారనీ విన్నవించారు.

వెంటనే మంత్రిగారు స్టేషన్ మాస్టరును పిలిపించి దారిమధ్యలో దింపి వేయుట ధర్మమా అని అడిగారు. ఆయన ట్రావలింగు శాఖవారు అలా చేశారనీ వారు తమ అధీనంలో విచారు కారనీ చెప్పారు. అందుమీద శ్రీ మంత్రిగారు ఆ విషయం దర్యాప్తుచేసి తమకు తెలియబర్చమని సేవసుపూసగురు చెప్పి-వెనుక వేస్తున్న రైలులో వారి ప్రయాణానికి సౌకర్యమివ్వమని చెప్పారు. (స్వ. వి.)

## చీరాల స్టేషన్ ఉద్యోగులపై ఆరోపణలు

### రైల్వేశాఖోద్యోగి విచారణ

చీరాల, డిశంబరు 21: ఈ పట్టణ సుప్రసిద్ధ వర్తకులు ప్రదేశ్ కాంగ్రెసు సభ్యుడు అయిన కోట రాములుగారు చీరాల రైలుస్టేషను ఉద్యోగులపై రైల్వే అధికారులకు ఫిర్యాదు చేశారు.

అందుమీదట బెజవాడ జిల్లా ట్రాఫిక్ అసిస్టెంట్ సూపరింటెండెంట్ (క్లెయిమ్సుశాఖ) ఎం. ఎఫ్. ఫర్నాండిజ్ గారు నిన్న యిక్కడికి వచ్చి శ్రీ కోటరాములుగారివద్ద మరి కొందరు వర్తకులవద్ద వాఙ్మూలాలు తీసుకొన్నారు. రాములుగారి తరపున ఒంగోలు న్యాయవాది ఎ. వి. సుబ్బారావుగారు విచారణలో పాల్గొన్నారు. అనంతరం విచారణాధికారి వూళ్లోకివెళ్లి మరికొందరి వర్తకులవద్ద వాఙ్మూలాలు తీసుకున్నారు. తమపై చేయబడిన ఆరోపణలు నిజంకావనీ, తమకు ఏమీ తెలియదనీ రైల్వేనౌకరులు కూడా విచారణాధికారికి వాఙ్మూలాలు ఇచ్చారు. విచారణాధికారి నిన్న రాత్రి బెజవాడ వెళ్ళారు. విచారణ ఫలితం త్వరలో తెలుస్తుందనుకుంటున్నారు. (స్వ. వి.)

## ఉరవకొండతాలూకా కాంగ్రెసు

### సర్వసభ్యసమావేశం

ఉరవకొండ, డిసెంబరు 25: ఉరవకొండతాలూకా కాంగ్రెసు సర్వసభ్యసమావేశం వేల్పుమడుగు గ్రామంలో శాసనసభ్యుడు సందా నారాయణప్పగారి అధ్యక్షతన ఇటీవల జరిగింది. తాలూకా కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి బంగారు రామిరెడ్డిగారు సభను ప్రారంభిస్తూ తాలూకా కాంగ్రెసులో ప్రాథమిక సభ్యులను విరివిగా చేర్పించాలనీ, తాలూకా కాంగ్రెసు కార్యవర్గసభ్యులు ఏదో కొంతకు కొంతగానైనా నిర్మాణకార్యక్రమం అమలు జరిపి సంస్థను పటిష్టం చెయ్యాలన్నారు. తరువాత ప్రదేశ్ కాంగ్రెసు సభ్యుడు, శాసనసభ్యుడు అయిన సందా నారాయణప్పగారు ప్రసంగిస్తూ స్వరాజ్యనానంతరం, స్వరాష్ట్ర సిద్ధిమున్నగు విషయాలు వివరించారు.

కాంగ్రెసు ప్రాథమిక సభ్యులను విరివిగా చేర్పించి సంస్థను బలంచేయాలనీ, కాంగ్రెసుకు అనుబంధంగా విద్యార్థికాంగ్రెసు, రైతుకాంగ్రెసు మొదలైన సంఘాలను తాలూకా అంతటా నెలకొల్పాలనీ, వేల్పుమడుగు గ్రామానికి విడపనకల్లుగ్రామంనుంచి ఒకటిన్నర మైళ్ళ రోడ్డు వేయించవలసిందిగా ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానాలు చేశారు. పి. వియాపి. రెడ్డిగారి కృతజ్ఞతాభివందనలతో సభ ముగిసింది.

## రైల్వేవిచారణ సంఘం ప్రశ్నావళి

కర్నూలు, డిసెంబరు 26: రైలు ప్రయాణీకుల ఇబ్బందులు తెలుసుకొని తన్నివారణకు అనుసరించవలసిన చర్యలు సూచించడానికి నియమించబడిన రైల్వే విచారణసంఘంవారు ప్రచురించిన ప్రశ్నావళిని ఆంధ్రప్రభుత్వ ప్రజాసంబంధశాఖ ఉద్యోగి శ్రీ గోపీచందుగారు ప్రకటించారు. ప్రశ్నలకు సమాధానాలు సంపాదించేవారు ఈ నెల 31 వ తేదీలోగా ... రైల్వే ... కార్యదర్శి శ్రీ హెచ్. ఎల్. త్రివేదీగారికి పంపించాలి.

## దేశాభివృద్ధికి విద్యార్థుల కర్తవ్యం

### విజయవాడలో శ్రీ సంజీవరెడ్డిగారి ప్రసంగం

[ఆంధ్రపత్రిక విలేఖరి]

విజయవాడ, డిశంబరు 26: "విద్యార్థులు ఇప్పుడే రాజకీయాలలో ప్రవేశించరాదు. కాని జరుగుతున్న పరిస్థితులను గమనిస్తూ విద్యావంతులైన తర్వాత రాజకీయాలలో ప్రవేశిస్తే దేశానికి మేలు చేకూరుతుంది. దేశంలోని అన్ని పార్టీలవారు దేశంలోని లేమిని తొలగించి దేశాన్ని సస్యశ్యామలంచేసి అందరికీ కూడు గుడ్డ కావాలనే ఆశిస్తున్నారు. అయితే యిది సాధించడంలో అవలంబించ దలుస్తున్న మార్గాలు మాత్రం భిన్నంగా వుంటున్నవి. మన స్వాతంత్ర్యం మొదలైన వాటన్నింటినీ నాగొట్టుకొని కొద్దికాలంలో అభివృద్ధిని సాధించాలనే నియంతృత్వాన్ని కావాలో, కొంతకాలం ఆలస్యమైనా స్వతంత్రం అనుభవిస్తూ అభ్యుదయం సాధించే ప్రజాస్వామ్యం గావాలో నిర్ణయించుకోవాలి" అని నేటి సాయంత్రం యస్. ఆర్. ఆర్. అండ్ సి. వి. ఆర్. కళాశాల ఆంధ్ర సంస్కృతి వారోత్సవ సభలో ప్రసంగిస్తూ ఆంధ్ర రాష్ట్ర ఉపముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డిగారు అన్నారు.

గత 30 సంవత్సరాలుగా మన దేశ చరిత్రను చూస్తే మనం ఎన్నడూ నియంతృత్వాన్ని సమర్థించలేదని, మనం ప్రజాస్వామ్యంలో విశ్వాసం వున్నవారమని రాజబాట వుండగా దొడ్డిమార్గం అవసరం లేదని సంజీవరెడ్డిగారు అన్నారు.

ఆంధ్ర ప్రభుత్వం గత మూడు మాసాలలో సాధించిన ఘనకార్యాలను వివరిస్తూ కేంద్రప్రభుత్వం గ్రాంటు యిచ్చినా యివ్వకపోయినా కృష్ణా గోదావరి రెస్యులేటరు బ్రిడ్జి నిర్మాణం, గోదావరి వరదకట్టల ఎత్తు పెంపకం, తుంగభద్ర నీరు రెండవపంటకు తెచ్చుకోవడం, నూతన ఆహార విధానం మొదలయినవన్నీ విజయాలేనని, మద్రాసు రాష్ట్రంలో వున్నంతకాలం మన పరిస్థితికంటె, ఇప్పుడు ఆంధ్రరాష్ట్రం వచ్చిన తర్వాత మన పరిస్థితిలో చాల మెరుగు కన్పిస్తున్నదని, ప్రభుత్వదృక్పథంలో చాల ప్రజలకు సుముఖంగా మార్పున్నదనీ చెప్పారు.

న్యాయాన్ని బలపరుస్తూవస్తున్న భారతదేశమే అంధకారంలో వున్న ప్రపంచానికి ఆశాజ్యోతి చూపించగలదని చెప్తూ పరాయిదేశానికి దాస్యం చెయ్యాలసివారు మనదేశానికి అధినేతలుగా రాకూడదని మనం గుర్తించుకొని మన స్వాతంత్ర్యాన్ని కాపాడుకోవాలని సంజీవరెడ్డిగారన్నారు.

మొదలు పెట్టిన వెంటనే మనం సాధించిన దేమిటని ఆలోచించకుండా క్రమంగా మెట్టవలె మనం అభివృద్ధిని సాధించాలని చెపుతూ ఈ కొద్దికాలంలోనే ఏదేశం సాధించని అభివృద్ధిని భారతదేశం సాధించిందని చెప్పారు రష్యాలోను, అమెరికాలోను ఏవిధంగా అభివృద్ధిని సాధించినా మనదేశ కాల పరిస్థితులకు అనుగుణంగా మన విధానాలను రూపొందించుకోవాలే గాని వాటిని గుడ్డిగా అనుకరించతగదు. మాది ప్రాంతీయాభిమానం అంటున్నారు. కాని ఈనాటికి రాయలసీమలో ఒక్క పైసా ఖర్చుపెట్టబడలేదు. ఏమైనా అది యిక్కడే ఖర్చు పెట్టబడింది. కృష్ణాడెల్టా మీ ఒక్కరి సొత్తుగాదు. రాష్ట్రం మొత్తం ప్రజల ఆస్తి"అని సంజీవరెడ్డి గారు అన్నారు.

"బెజవాడ రాజధాని కావాలన్నంత మాత్రాన అది ప్రజాభిప్రాయం కాబోదని, యిక్కడ గూడ రెండు అభిప్రాయాల ప్రజలున్నారని చెపుతూ మీ వాదన పరియైనదని తోచి, మీరునమ్మి ప్రచారం చేసుకుంటుంటే, ఈ హక్కు మీకుంటే, మేము నమ్మింది సరియైనదని మేముగూడ ప్రచారంచేసుకొనే హక్కు మాకున్నది. మీరు వినకపోతే, మా ప్రచారాన్ని మరొకచోట చేసుకునే హక్కు మాకున్నద" అని వారు అన్నారు.

తమను ప్రతిదినం దుయ్యబట్టే పత్రికలవారు తాము చేసిన మంచి పనులనుగూర్చి ఏమైనా వ్రాశారా అని ప్రశ్నించారు.

మనదేశాన్ని మరోదేశానికి తాకట్టు పెట్టే పార్టీ అధికారంలోకి రాకుండా చూసుకోవలసిన బాధ్యత ప్రజలమీద నున్నదని చెపుతూ, గత ఎన్నికల సమయంలో తండ్రి కాంగ్రెసువాడి, కుమారుడు కమ్యూనిస్టు అయిన కొటూరు గ్రామంలో ఆ వాడు కమ్యూనిస్టు తండ్రికి కాంగ్రెసుకుమారుడున్నాడని, ఇది ఒక చక్రంలాంటిదని ప్రజలు తెలుసుకోవాలని సంజీవరెడ్డిగారు వివరించారు.

కళాశాల ప్రిన్సిపాలు శ్రీ యం. రఘునాథాచారిగారు సభకు అధ్యక్షత వహించారు.

### గమనిక

మొన్న ఆదివారం ఆంధ్రపత్రికలో ఏకరణ లేకుండా అచ్చయిన చిత్రం ముఖ్యమంత్రి ప్రకాశంగారు గుంటూరు హిందూ కళాశాలకు వచ్చినప్పుడు విద్యార్థి యూనియన్ వారు స్వాగతమిచ్చినప్పటి చిత్రముగా పాఠకులు గ్రహింప గోరెదము. సం.

## భూదానయజ్ఞం జయప్రదం చెయ్యండి

### శ్రీ వల్లభస్వామి ఉద్బోధ

వినయాశ్రమం, డిసెంబరు 24: "గాంధీజీసిద్ధాంతాలు నిత్య నూతన వికాసాన్ని పొందుతున్నవి. సమాజ వికాసానికి నూతన విప్లవం ప్రజ్వరిల్లుతున్నది. సమాజ వికాసానికీ, ఆర్థిక సమానత్వానికీ, పూజ్య వినోభాజీ భూదానయజ్ఞ శంఖారవాన్ని పూరిస్తున్నారు. సర్వోదయానికీ, సర్వోదయ ఆంధ్రరాష్ట్ర స్థాపనకూ, భూదాన యజ్ఞానికీ అందరూ తోడ్పడాలి" అని వినయాశ్రమ 20 వ వార్షికోత్సవం సందర్భంలో నిన్న జరిగిన బహిరంగ సభకు అధ్యక్షత వహిస్తూ సర్వ సేవా సంఘం కార్యదర్శి శ్రీ వల్లభస్వామీజీ అన్నారు.

తుమ్మల బసవయ్యగారు వినయాశ్రమ చరిత్ర వివరించి అధ్యక్షుణ్ణి సభికులకు పరిచయం చేశారు. శ్రీయుతులు ప్రభాకర్ జీ, ఎర్నేని సుబ్రహ్మణ్యం, బాలరాజుమహర్షి దోనేపూడి వెంకటసుబ్బయ్య, స్వామీ సీతారామ్, గంగరాజు రఘునాథరావు గారలు కూడా సభలో పాల్గొన్నారు.

శ్రీ వల్లభస్వామీజీ వినయాశ్రమం చేస్తున్న కృషి ప్రశంసించారు. సజీవ సంస్థల జన్మదినోత్సవాలు పెంపొందిన కొలదీ వాటికి శాశ్వతత్వం లభిస్తుందన్నారు. వినయాశ్రమంలో విద్యాలయం, చికిత్సాలయం, ప్రసూతి కేంద్రం, బేసిక్ శిక్షణాలయం దిన దినాభివృద్ధి చెందుతున్నవన్నారు.

బసవయ్యగారు ప్రసంగించిన తరువాత తిలక్ జాతీయ నవీన విద్యాలయంలోని బాలబాలికలకు ప్రభాకర్ జీ బహుమతులు పంచిపెట్టారు. తరువాత ఎర్నేని సుబ్రహ్మణ్యంగారు ప్రసంగిస్తూ ఆంధ్రలో భూదానయజ్ఞం జయప్రదం కావడానికి దీక్ష వహిస్తున్నామన్నారు. సర్వోదయ రాష్ట్ర సిద్ధికి ఆత్మబలిదానం చేసిన పొట్టి శ్రీరాములు గారి ఆశయం నెరవేరే వరకూ ఆంధ్రులు కృషి చెయ్యాలన్నారు.

స్వామీ సీతారామ్ వినయాశ్రమం కార్యక్రమం వివరించి సభికులకూ, సభాపతికీ, సహాయకులకూ అభినందనలు తెలిపారు.

## మామిడిపిల్లి గెడ్డ ప్రాజెక్టు ఆహ్వానసంఘం ఏర్పాటు

పాలూరు, డిసెంబరు 24: పాలూరు తాలూకా కాంగ్రెసు కార్యవర్గం వారు యీ నెల 18-వ తేదీన సమావేశమై మామిడిపిల్లిగెడ్డ ప్రాజెక్టుమహాసభను 1954 జనవరి 17, 18 తేదీలలో ముక్కువ గ్రామంలో జరుపుటకున్నూ, ఆ సభకు ఉపముఖ్యమంత్రి సంజీవరెడ్డిగారిని, ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షులను, బెండి కూర్మన్న గారిని ఆహ్వానించుటకు నిర్ణయించారు.

ఈ దిగువవారిని ఆహ్వానసంఘంగా ఎన్నుకొన్నారు: అధ్యక్షులు శ్రీ దాకేటి అప్పలస్వామిగారు, కార్యదర్శి శ్రీ ముక్కువ వెంకట అప్పారావుగారు, సభ్యులు- శ్రీయుతులు- చక్కారు బలరామయ్యగారు, లింగం మోహనరావుగారు, అల్లు యెరుకునాయుడు, మీసాల పెదరామినాయుడు, మత్సకృష్ణమూర్తినాయుడు, బలగ నారాయణ, కోయ్యాన లక్ష్మన్నాయుడు, పెంట వాసుదేవరావు, చందాన జగన్నాథనాయుడు, కొంగు పద్మనాభనాయుడు, అల్లు లక్ష్మన్నాయుడు, పెంట నారాయణమూర్తి నాయుడు, ఇప్పిలి నీలయ్య, ముసెక కృష్ణమూర్తినాయుడు గారలు.

## మద్రాసు రాష్ట్రానికి ధాన్యం అక్రమ రవాణా

### పుత్తూరుసమీపంలో రెండు లారీల స్వాధీనం

నగరి, డిసెంబరు 24: ఆంధ్రరాష్ట్ర సరిహద్దులనుంచి పరిశిష్ట మద్రాసు రాష్ట్రమునకు లారీలలో, వడ్లు, రాగులు తీసుకొనివెళ్లుతుండగా పుత్తూరు దొంగరవాణాల నిరోధక పుశీప్యూటీతహశీల్దారు శ్రీ బి కృష్ణమూర్తిగారు యిచ్చటికి 8 మైళ్ళలో నిన్న 60 బస్తాలవడ్లుగల ఒకలారీని, నేడు 50 బస్తాల వడ్లు, 10 బస్తాల రాగులుగల మరొకలారీని పట్టుకొని వాటిలోని ధాన్యాలను స్వాధీనపరచుకొన్నారు. ధాన్యం కొనుగోలుదారుని మీద అక్రమరవాణాచట్టం క్రింద కేసు పెట్టారు. (స్వ వి)

## కమలాపురం తాలూకా రైతు సంఘం

ఎర్రగుంట్ల, డిసెంబరు 24 కమలాపురంతాలూకాలో రైతుల పరిస్థితులు ఇంకా బాగుపడలేదుకనుక అప్పుల వసూలు వాయిదా వెయ్యమనీ, సహకారబ్యాంకులు మొదలైన వాటికి రైతులు చెల్లించవలసిన అప్పులపై మారటోరియం ప్రకటించ వలసిందిగానూ ప్రభుత్వాన్ని కోరుతూ ఆక్కడి మునాఫర్ బంగళాలో నిన్న జరిగిన తాలూకా రైతుసంఘ కార్యవర్గ సమావేశంలో తీర్మానించారు. సభకు శ్రీ అచంట నారాయణరెడ్డిగారు అధ్యక్షత వహించారు. ఆర్. చినచెన్నారెడ్డిగారు రైతుసంఘ కార్యకలాపాలను గురించి నివేదిక సమర్పించారు.

గండికోట ప్రాజెక్టు, తుంగభద్ర ఎగువకాలవ నిర్మాణపథకాలు వెంటనే ప్రారంభించవలసిందిగా ప్రభుత్వాన్ని కోరుతూ ఒక తీర్మానం చేశారు.

కమలాపురం, ఆదోని, తిలపనూరు, వల్లంగాముపల్లె చెరువులకు సప్లయి కాలవలు తవ్వించవలసిందిగానూ, ఇటీవల అతివృష్టి వల్ల దెబ్బతిన్న ఉప్పలూరు చెరువును వెంటనే మరమ్మతు చేయించవలసిందిగాను వేరొక తీర్మానంలో ప్రభుత్వాన్ని కోరారు. తుంగభద్ర విద్యుచ్ఛక్తి ఉత్పాదక కేంద్రంనుంచి కమలాపురం తాలూకాకు కూడా విద్యుచ్ఛక్తి సప్లయి చేయించవలసింది గానూ, చేనేత కార్మికులకు మంజూరు చేయబడిన గంజికేంద్రాలను వెంటనే ప్రారంభించ వలసిందిగానూ ప్రభుత్వాన్ని కోరుతూ ఒక తీర్మానం చేశారు. తాలూకా రైతుమహాసభ మార్చిలో జరపాలని నిర్ణయించారు.

## విశాఖపట్నంలో అగ్నిప్రమాదం: ప్రేమసమాజం సేవ

విశాఖపట్నం, డిశంబరు 25: నిన్న ఉదయం వెలంపేటలో అగ్నిప్రమాదం సంభవించినందున 147 యిండ్లు పరశురామప్రీతి చెందినవి, యిందు అర్పుటలో పాల్గొనడమేకాక నిరాశ్రయులైన 750 మందికి భోజన సదుపాయములుకూడా ప్రేమసమాజం వారు చేశారు. ఈ సందర్భములో శ్రీ పువర్తి రామం బ్రదర్సువారు 1 బస్తాబియ్యం, శ్రీ పి కె అప్పల నరసయ్య అండ్ సన్సువారు ½ బస్తా బియ్యం, జనాబ్ సాలేమూన్ సాహెబ్ గారు ½ బస్తాబియ్యం, శ్రీ కలగర్ల నరసయ్య అండ్ సన్సువారు 25 శేర్ల బియ్యం, సహాయం చేశారు.

